# ఆంధ్రప్రశస్తి




విశ్వనాథ సత్యనారాయణ

# నతి

మీఁదై క్రిందయి నారు కాకవులు సామీచీన్యపంథాగతుం
డై దూరీకృతశత్రుడై మఱియుఁ దానై కైతకొగ్గన్ కవుల్
లేఁదూండ్లంబలె నీరసంపడిరి కాళీపాదమంజీరనా
దాదేశంబున మద్గురూత్తముడు శబ్దాంభోధి బంధించుచో

పుడమిని పెక్కు సత్కవులు పుట్టిరి ముట్టిరి సత్కవిత్వపుం
దొడిమలు చెళ్లపిళ్లకవితోఁ దులతూగెడు వారె వానలో
తడియనివారు మద్గురు వధాన మృదూక్తి మరందధారలో
గడుగనివారు మాకెచటఁ గానగ రారిలఁ దెల్గునాడునన్

పలు పలుకులేల కవితా
లలితాంగికి కొప్పులో నలంకరణమ్ముల్
కలిపించిరి లేజాజుల
తెలిమల్లెల తావి పెల్లు దిక్కులనొరయన్.

*

మా పూర్వాంధ్ర ధరాధినాయక కథా మంజూషికా రత్న గా
థా పద్యావలి పేరి హారి సుమనో దామంబు మాధ్వీక భా
షా పృక్తంబు మహాప్రబంధ రచనా సౌందర్యపున్ వాసనల్
తీపై క్రమ్మఁగ నాంధ్రసోదరుల కందిత్తున్ గళాంకమ్ముగన్

*

# ఆంధ్రవిష్ణువు

మగధమును జయించి భారతదేశ చక్రవర్తి యయిన పూర్వాంధ్ర రాజవంశములో చరిత్రము తెలిసినంతవరకు కీశడే పూర్వుడు. ఇతడు నిశుంభుడను రాజును చంపి శ్రీకాకుళము రాజధానిగా నాంధ్రదేశము పాలించెను. ఈదేశమున కితనివలననే యాంధ్రదేశమని పేరువచ్చినదట. భీమేశ్వరము కాళేశ్వరము, శ్రీశైలము ఈ మూడుక్షేత్రములకు చుట్టును పెద్దగోడ కట్టించి యితడు త్రిలింగమను పేరాంధ్రమునకు కల్పించెను. ఈయన తరువాత దేవుడుగాఁ బరిగణింపఁబడి యితనిపేర శ్రీకాకుళమున నాంధ్ర విష్ణువు నాలయము కట్టింపఁబడినది. కాసులపురుషోత్తము తన యాంధ్ర నాయకశతక మితనిమీదనే చెప్పినది. శ్రీకృష్ణదేవరాయలు ఆముక్తమాల్యద వ్రాయుటకుఁ గారణ మీయన కలలో కనబడి యాజ్ఞాపించుటయే.

'జో! సామీ! మముగన్న యేలిక! యిదో! జోహారు! జోహారు! మా
శ్రీశైలంబునఁ బెద్దకొండదరి గర్వీభూతచేతస్కుడై
యీశారాధనలబ్ధదోర్బలుడు దైత్యేంద్రుండు లేడా! బుభు
క్షాసంపూర్తికి నోచుకోముగద కక్కా వాని దుశ్చేష్టలన్.'

''కృప''యని సన్నవల్వలుమృగీమదముఁ తొలికాన్క వెట్టి క
ప్రపుపాడి చల్లి మేలడవిపందులమాంసము జిడ్డుదేరు బ
ల్లెపుఁగొనలం దెలుంగుపతి లేఁజివురుం బద మంటఁ దూర్పు సం
ద్రపుపాలిమేర లేలిక కిరాతులమేల్సరదార్ల కిట్లనున్.

''మాకుఁ వానిగుణించియే కలద, యీమాయాప్తులారత్నగ
ర్భాకాంతుల్ ఋషికల్పులౌగురులమంత్రంబుఁ విచారించి దీ
క్షాక్లృప్తంబు పొనర్చినార మిదిగో ఖండేందుచూడామణి
శ్రీకంఠచ్ఛవిరక్షు నీవరకుఁ బేర్చెఁగాక వాడుద్ధతిఁ.'

అనుపలు కాంధ్రవిష్ణుని ముఖాగత మయ్యెనో లేదో దాని విం
చునె సరదార్ల దైత్యుడు నిశుంభుడు చచ్చెను చచ్చెనంచు లో
ననుకొనుటొండె జాగుగఁ దదాననదివ్యజయారవప్రతి
ధ్వనితమ మయ్యె నాంధ్రనరపాల సభాభవనంబు సాంద్రమై.

కొలది నాళులకు దిగ్వలయసుందరముగాఁ
ప్రాకారమును గట్టఁ బంచినాడు
సాగరమేఖలాచారు కుచద్వయీ
శాయి యాంధ్రావని చక్రవర్తి

కాళేశ్వరంబు శ్రీశైలమ్ము భీమేశ్వ
రమ్మును గలిపి యాంధ్రము త్రిలింగ
చిహ్నితమ్ముగఁ జేసె సిద్ధఖేచరయక్ష
కాంత లాసాగను ప్రాకారమార్గ
మనుసరించెద రుదయసంధ్యాప్రశాంత
సమయరోచుల స్వచ్ఛార్ధచంద్రమకుటు
మూడులింగమ్ములకు భక్తి పూజసేయ
పవనచలితాంశుకాంతలై ప్రతిదినమ్ము.

విప్రాశీఃఫలభాజనుం డతడు తన్వీ భూసురశ్రేణి బ్ర
హ్మప్రీత మ్మనుచున్ త్రిలింగముల సంధ్యల్ మూట సేవించె వే
దప్రామాణ్యముగాగ నాంధ్రపతి, యేతద్దివ్యయోగాతి ని
ష్ఠాప్రీతుం డయినాడు త్రైపురసతీ సౌభాగ్యనిర్ణేతయున్.

*　　*　　*　　*

నడిపింపఁబడి మహాసాకాదళ మ్మింద్ర
కీలాచలముదాక కృష్ణకెదురు
ఛేదింపఁబడి మహాశ్రీశైల సవిధభూ
స్థలములదాక కాంతారసమితి

గమియింపఁబడె దైత్యగహ్వరమ్మున దాక
రవము విన్పడఁ జతురంగబలము
సేవింపఁబడె హిమక్షితిధరకన్యకా
సౌందర్యధనుడు శ్రీశైలరాజు
తలవని తలంపుగా సముద్భవనినాద
బధిరితాశాచయంబులు పగిలిపోవ
ఆంధ్రపతిచేత స్వీయసైన్యములచేర
విరిగిపడియె నిశుంభుపై పిట్టపిడుగు.

ఆంధ్రభూధవుసైన్యము నిమేషంబులో
వనమునెల్లను బట్టబయలు చేసి
అరికొండమార్గమ్ము లెఱింగినవాడు గా
వున వానియాట సాగనివిధమున
అఖిలమార్గమ్ముల నరికట్టి, గుహలను
నద్రిభాగమ్ములు నావరించి
దైత్యుడు నివసించుతావుచుట్టును మహా
గజయూథములు నిల్వఁ గాపువెట్టి
కృతజయారావములను పేరెములు వార
నాడి నించుక లెక్కసేయని దితిజుడు
తెలిసికొని వైరిబలమెల్ల వెలికి వచ్చి
రోషదష్టాధరుండయి రుద్రమూర్తి.

త్రినవజ్ఞం గలశూలముఁ గాని సముద్యత్క్రోధతామ్రమాతుఁడై
క్రైనుగుఁ భూలలనామనోహరు శిరోధిన్యస్తలక్ష్యమ్మునఁ
మును లంఘించకమున్న దానవునిఱొమ్ముఁ గాఁడ నేసెఁ మహో
శనికల్పం బగుబాణ మాంధ్రపతి పెల్చుఁ మందహాసంబునఁ.

ఉదయమార్తాండనీలోత్పల బంధుకాం
తులు తోచె లోచనాంచలములందు
చాదకౌస్తుభమణిచ్ఛవులు గ్రమ్మె నసృజ్జ
దమ్మైన వక్షఃస్థలమ్మునందు
తనకుటుంబము తలంచిన విశ్వవహానభా
రమ్మయ్యె గర్భగోళమ్మునందు
అఖిలవేదాంతవిద్యాశ్రయమవైరాగ్య
విస్ఫూర్తి గలిగె హృద్వీథియందు
ఆంధ్రవిష్ణువు శ్రీకాకుళాధినేత
శ్రీసుచంద్రాత్మజు పృషత్కశేఖరమ్ము
హృదయనిర్భేదముగ నాటు నింతలోన
నాంధ్రవైరి నిశుంభదైత్యాధిపునకు.

అంచించం గలయాంధ్రనాయకుడు బాణాగ్రంబునం దగ్ని సం
ధించెన్ గావలె కాకపోవునెడ దైతేయేంద్ర దేహోద్గత
ప్రాంచత్పావకకీల భగ్గురని యాప్రాంతాటవుల్ కాలిపో
బంచారించిన పల్లెలుం బురములున్ ప్రారంభ మే లయ్యెడున్.

త్రాసితలోక మాంధ్రవసుధాపతిసైన్యము, వీరకోటిబా
హాసముదీర్ణఖడ్గగళితాంచితకాంతులు నుర్వ్యగాగ వ
ర్షాసమయోగ్రశైలకుహరస్రుతనిర్ఝరమట్లు వచ్చి కృ
ష్ణాసరిదుల్లసత్ఫణిఫణామణి కాకుళ మంత చేరగన్.

ఆపురరాజ్యలక్ష్మి యెదురై కపురారతులిచ్చె మోహన
శ్రీపద మైనయాననము చెంతల స్వాగతమందహాసరే
ఖాపృషదంకురమ్ములు నిగారము చూపగ సర్వభూషణా
ప్రాపిత దేహయై శిఖరవాయుచలద్విలసత్పతాకయై.

శ్రీకృష్ణవేణీగరిష్ఠపాథస్తరం
గాహతప్రాకార మైనయదియు
బురుజుల దితిజసమూహరక్తము గ్రోలు
నాల్కవోలు పతాక నాటినదియు

ఆంధ్రవీరభటాళి కాత్మశౌర్యంబుల
యందు శాణోపలం బైనయదియు
ఘంటశాలాపురీకలితపూర్వాంధ్రశి
ల్పాచార్యులకు తల్లియైనయదియు
రాజరాజాంధ్రవిష్ణుని రాజధాని
కలుషములకెల్ల పిడుగు శ్రీకాకుళంబు
కన్నులకుఁ గట్టినట్లుగఁ గానబడెడు
వేదకాలమునాటి ముత్తైదువట్లు.

# శాతవాహనుడు

ఆంధ్రచక్రవర్తుల వంశమునకు శాతవాహన వంశమని పేరు. దీపకర్ణి యనురాజు భార్య పాము కరచి చనిపోయినది. అతడామె యెడ యెడదవలన మరల పెండ్లి యాడలేదు. ఒకనాడు దుఃఖించుచుండ రాజునకు స్వప్నమున కులదేవత మరునాడు వేటకు వెళ్లుమనియు వెళ్లినచో నచట సింహముమీద నొకబాలుడు కనబడుననియు వానిని తెచ్చుకొని పెంచుకొను మనియు చెప్పెను. అట్లే రాజు వెళ్లగా సింహము దానిపైన స్వారిచేయు బాలుడు కనఁబడిరి. సింహము బాలుని దింపి నీరు త్రాగుటకు పోగా రాజు దానిని చంపుటకు బాణము వేసెను. అది గంధర్వుడై యీ క్రింది కథ చెప్పెను.

కాషాయ రమ్యవల్కల హుతాశన శిఖా
సంపిహితాశ్వత్థ సామిధేని
భువన మోహనహేతు నవవయః ప్రత్యూష
స్సమయ రోచిః పూర్ణ చంద్రరేఖ
కుపిత శంకరనేత్ర కుహరాగ్నిదగ్ధ మ
న్మథ దేవునకును ప్రాణ ప్రతిష్ఠ
అమిత లావణ్యా నీలాకాశ పశ్చిమా
శాచరత్సిత నూత్న జలదశకల

మొక్క ఋషికన్య జలకలశోజ్జ్వలాంస
లలిత కృష్ణానదీ ముక్తపులినసీమఁ
గలసికొనె నొక్క యక్షుని గలసె వారి
యమృత లజ్జాతి మధుర నేత్రాంచలములు.

ఆ మధురంపు దృక్కు ఫలమై యుదయించిన యీకుమారు డి
వ్యామృతవాహి నీ మధురమా పసినవ్వులె నన్ను నిల్పె నీ
భూమిపయిన్ లతాంగిసుతు పుట్టినతో నెగతించినన్ మునుల్
హో మృగరాజరూపమును పొందుమటంచును శాపమిచ్చినన్

నీ వాంధ్రేశ్వరుఁ డౌదు శాపవిధమంతే శాతుడన్ నేను నీ
కై వీనిం గని పెద్దఁ జేసితిని రాజా! వీడు కోదండ బా
హా విధ్వస్త దిగంతరాహిత ధరా ప్రాణేశ చూడామణి
గ్రీవామంజుల హార రత్న రుచిర శ్రీపాదకంజుండగున్.

నీ నలినాక్షి శక్తిమతి నిద్రితశయ్యను సర్పదష్టయై
ప్రాణములన్ త్యజించుట శుభప్రతిపాదకమయ్యె నేటికిన్
వీని సమస్తరాజ్యపదవీస్థితుఁ జేయుము, జీవితాంతసం
ధ్యానవవేళనీ ముసలి యంసము కొంచెము విశ్రమించుతన్!

అంతర్ధానము పొందె యక్షుఁ డిటు లం చాదీపకర్ణిక్షితీ
శాంతర్దాహము కుట్టువానినవగంగాంభోజ పత్రాగ్రసే
క్రాంతమ్ముల్ గనుగొన్నయంతటననీహారాంబుధారాప్రషత్
సంతాన ప్రసరమ్ముపోలె నయి హృత్పద్మంబురాగిల్లినన్

కనుగొనలందుబాష్పములుగ్రమ్మగ, కంఠము రుద్ధమాచు నా
యన చనుదెమ్ము నీచిఱుతలైనకరమ్ములు నాగళమ్మునం
దున బిగియింపు శక్తిమతి తొంగలి ఱెప్పల పోలి యున్ననీ
కనులకు నాంధ్రదేశ మది కైవసమయ్యెనురా! కుమారకా!

నీ కర్పూరపు ఖండముల్ భుజము లందింపగదో యీ! శిశూ!
నాకంఠంబున యందు శక్తిమతి యేనా డట్టులయ్యెన్ భవ
న్నాకందప్రసవాతి మంజుల లసన్మందస్మితంబుల్ కనుం
దాకన్ శూన్యమయయ్యెనాబ్రదుకుసంధ్యామల్లికామోహనా!

నాతరువాత నాయకవినాకృత యాటకు రాజ్యలక్ష్మియున్
ప్రీతి జలాంజలిన్ విడువ బిడ్డలులేమి పితృవ్రజంబు శో
కాతివిషణ్ణులై మనెదరన్న! భవన్ముఖ చంద్రదర్శన
స్ఫీతులఁజేసి నాకులము పెంపు గడింపుము తండ్రి! రమ్మురా

తెనుగుఁ జేండ్లకు నాదిపూరుషుడు దై తేయాంతకుం డాంధ్రవి
ష్ణుని లక్ష్మీకుచకుంకుమారుణ కరస్తోమంబు నీవిచ్చుత
ర్పణముల్ గైకొనఁ జూపగాఁబడును రారా కుఱ్ఱ,నీమందహా
సనవజ్యోత్స్నలుచూడశక్తిమతినోచఁ లేదురాపుత్రకా!

ఈ నిఖిలాంధ్రరాజ్యరమ కేలిక వాదువు దీప కర్ణిసం
తానముగాఁగ నిగ్గొలుచు ధాత్రిజనావళి ప్రాక్సముద్రమం
దానినసీరు పశ్చిమ మహాంబుధిఁ ద్రావుము కృష్ణనీరు గం
గానదిఁ జేర్పు మాంధ్రసతికంఠలసన్నవహారమో యనఁ.

నీ కోదండ వినిర్గతాశుగ మహాగ్నిజ్వాలలఁ దట్టమై
యేకోనల్ దహియింపగాఁబడెడు తండ్రీ! యవ్వి శ్రీకృష్ణవే
ణీ కళ్యాణ పృషత్పరంపరల శాంతిఁ సస్యవంతంబులై
శ్రీకేదారములై తగుఁ విజయలక్ష్మీకేశ బంధంబులై.

తెనుగుఁ రాజుల వంగసం బిక భవద్దివ్యాంకమై శాలివా
హన వంశంబని పిల్వగాఁబడెడు గాకౌ రాఘవుండుఁ గడిం
పని దీకీరితి వంశకర్తగుట సామాన్యంబె లేరెంద అ
య్యినవంశ్యుల్ రఘువంశమైనయది కాదా!యామహారాజుపై!

అనుచును దీపకర్ణి పసియాతని చంకకు నెత్తుకొంచు తె
ల్లని తనగడ్డ మత్తికొనలన్ జడివారినమోద బాష్పవాః
కణములు జాఱి సిక్తమయి కన్నులుమూతవడంగవిల్లుచం
కను తగిలించి నెమ్మదిగ కాకుళమార్గముపట్టె నొంటిగన్

ఆరాజన్యునిమీాద మందపవన వ్యాకీర్ణ పాథోలవ
శ్రీరమ్యాకృతి కృష్ణవేణి తటిమెన్ స్వీయాంబుధారాప్లవ
స్నీరేజామృత వాసనాలహరి దిక్స్రాహ్లాదమో నా వసం
తారామమ్ములలో పికమ్ములొలికెన్ ద్రాక్షారసాంభోనిధుల్.

# గోతమిపుత్ర శాతకర్ణి

నాసికపట్టణములోని కొండచివరిగుహాయందలి యొకశాసనములో నితనిగురించి యున్నది. ఇతనితల్లి గోతమి. ఇతడు రాజాధిరాజు. ధాన్యకటకము రాజధాని. మహేంద్ర వింధ్యావత పారియాత్ర సహ్య కృష్ణగిరి చకోరాది పర్వతము లితనిరాజ్యములోనివి. విద్యానిధి. ఇత డొక్కడే ప్రజ్ఞావంతుడు, ధనుర్విద్యావిశారదుడు. ఇతని పరాక్రమము నాభాగనహుషజనమేజయ సగర యయాతి రామాంబరీషాదులను మించియుండెను. ఇవి శాసనములోని కొన్నిమాటలు. శకయవనహూణులు పరదేశీయులు వచ్చి భారతదేశ మాక్రమించుకొనిరి. వారిలో క్షాత్రపులనువా రొకతెగ, నహపానుడనువాడుమహాక్షత్రపు డను బిరుదుతో సౌరాష్ట్ర మాక్రమించుకుని కొంతవరకాంధ్రరాజ్యవిజృంభణము నాపినాడు. ఈగోతమిపుత్ర శాతకర్ణి శాతవాహనుడు సౌరాష్ట్రీకు జయించివారి వంశమే నిర్మూలించి యాంధ్రచక్రవర్తిత్వము మరల నిలిపినవాడు.

మునుముందు రణనిస్సహాణభేరికా శంఖ
సకల వాద్యము లుష్ట్రసమితి మోయ
నావెన్క వారకాంతాలి నాట్యమ్ములు
గీతికా మాధుర్య రీతి చూప

పైన మేల్సరదాళ్లు బారులు తీరిచి
ఘనజవాశ్వంబుల ఖదను పోవ
వెనుక ధానుష్కులౌ వీరులు తెనుఁగురా
జ్యపుబొడ్డు లీధాత్రి యద్రువ నడువ
నచట తురగ పదాతులు నచటి వెనుక
సమదగజయూధికాసహస్రములు మీద
బల్లెపుం బోటుతో రిపుప్రాణ హారు
లుక్కుతున్క లాంధ్రభటాళి యొత్తినడువ.

ఆపై కంచురథాలపై తెనుగువా రన్నన్న యొక్కొక్కఁడే
మూపన్ గల్గును ముష్టిఘాతముల దిఙ్మత్తద్విపేంద్రమ్ములన్
చాపాచార్యులు వారిదోఃకలిత రక్షాశక్తి దుర్భేద్యుఁడై
వే పోవందొడఁగెన్ తెలుంగుపతి పృథ్వీచక్ర మల్లాడఁగన్.

జయజయ గౌతమీ సాధ్వీ మహాగర్భ
జనితముక్తాఫల జయము జయము
జయజయ ఆంధ్ర భూచక్రరక్షాదక్ష
సవ్యబాహాదండ జయము జయము

జయజయ పార్థైక సామాన్యఘన ధను
శ్శాస్త్రాధిక్కృత రిపు జయము జయము
జయజయ నల హరిశ్చంద్ర పురూరవ
శ్చక్రవర్తిసమాన జయము జయము
జయము జయ మాంధ్రనాయక జయము జయము
బహుపరాకంచు వెనువెంట పైడిపొన్ను
వెండి కర్రల నెత్తి దీవెనలచేసి
బట్టువారు కైవారముల్ పట్టుచుండ.

లలితామోదభరప్రసూన నవమాలా భూషితుం జేసి రు
జ్జ్వలసౌధాగ్రము లెక్కి కుంకుమము లాజల్ చల్లి రంభోజనే
త్రలు క్రొంజీరచెఱంగు మాటుబడి యర్ధవ్యక్త మానాననం
బుల శృంగారపుటోర చూపుల సుధాపూరంబు లూరించుచున్

కాళ్లకు పారాణి కన్నుల కాటుక
చెలువొప్పు ముత్తైదువలు ముసళ్లు
పసపు పూసిన మేలి నొసలులపై వెడ
లైన కుంకుమబొట్టు లంద మెసగ

ముడుతలువడి కొంచెముగ వంగినయొడల్లు
కనకాంబరమ్ములు కాంతి తరుమ
లలితమంజీర మంజుల నాదములతోడ
పుంజీభవన్మహా పుణ్యారాసు
లట్లు కదుపుగ త్రిపుర సంహార కేళి
పాటపాడుచు నెదురుగా వచ్చినారు
ఆంధ్రధారుణీ ధవుని సైన్యముల కెల్ల
విజయలక్ష్మి ప్రసాదాంక విధము వోలె.

అతడు కాదటవె ఓ! అక్క మాలవనాథు
కుత్తుక బల్లెమ్ము గ్రుచ్చినతడు
అంతవినమ్రము డమ్మా వంగి మనకు న
మస్కారమొనరించు మధురరీతి
చూచితే ! తండ్రి ! నీశూరతా రేఖాప్ర
ధాన బాహువులు యుద్ధమున యందు
శత్రువక్షోభాగ జనితా సృగుదిత వీ
రావతారమ్ములై యమరుగాత
మనుచు దీవించె ముసలిముత్తైదు వోర్తు
గడచిపోవు సైన్యాగ్రభాగమున యందు
నుత్తమాశ్వంబుపై పోవునొక్క యాంధ్ర
తరుణతాసీము వీరావతారు చూచి

తన యరదంబునుండి పతి ధాత్రికి డిగ్గి కృతప్రణాము డ
య్యెను తల నేలదాకుగతి వృద్ధసువాసిను లిచ్చు కుంకుమం
బును ప్రసవంబులున్ గొని నమోనమ యంచురథంబునెక్కె నం
తన జయ మంత్రసిద్ధమ యనన్ దనసైన్యములెల్ల నార్వగన్

కాఱియలేక ధాన్యకటకంబున రథ్యలు వెన్కగా బహి
ర్ద్వారము దాటి యాంధ్ర వసుధాపతి యాపురివంకచూచినన్
క్రూరత శత్రురక్తములు క్రోలగఁ జాచిన నాల్కలా పతా
కా రభసంబు ధాన్యకటకంబు వెలార్చెను రాజుకంటికిన్.

వేలయు లేనియంబునిధి వేగమునన్ జనునాంధ్రసైన్యజం
ఘాలత మందగించె క్షణకాలముమాత్రమ యాంధ్రవిశ్వవి
ద్యాలయ మిచ్చుస్వాగతము నందుటకై యమరావతీపురిన్,
బాలకవుల్ పఠించుజయపద్యములన్ విని మెచ్చుకొంటకున్.

మానితగౌతమీసతి కుమారుని సైన్యము లెల్లదాటి కృ
ష్ణానది పశ్చిమోత్తరదిశాముఖమై చనుచున్ తెలుంగుమా
గాణపుటెల్ల దాటి చనగా నెదురయ్యెను వచ్చుచున్ ప్రతి
ష్ఠానపురంబునుండి తనసైన్యముతో 'పులమావి' దండగా.

గౌతమీసుత శాతకర్ణి యీ శాతవా
హనుడు తా నసలు దావాగ్నికీల
శ్రీపులమావి వాసిష్ఠీకుమారకుం
డా యువరాజు ఝుంఝూనిలంబు
ఇంక నేమయ్యెనుమ్మా నహపానుడు
సౌరాష్ట్ర మింక భూస్థాపితంబ
క్షాత్రపుం డేటికి గడియించుకొన్నాడు
శత్రుత గౌతమీ పుత్రుతోడ
అనుచు గుసగుసలాడినా రాంధ్రభటులు
కొండటవి జయారావము లందు మునిగె
రెండుసైన్యమ్ములును ధరిత్రీతలంబు
పగిలిపోవగ సౌరాష్ట్రపథము నడచె.

తెనుగుపాలాలతేనిగడిదేరినబంటుల కాలిదుమ్ము న
ల్లనిపెనుభూతమై గగనలంబినియై పెనుగాలి రేగి ముం
దునకు వెలార్చగాబడుటతో నహపానునిరాజ్యలక్ష్మి తే
జునుదొరగెఁ పయిఁ తెనుగుశూరులురాజ్యముచొచ్చినంతలో

మూలచ్ఛిన్నము లయ్యెదుర్గములు క్రమ్మసైన్యముల్ పేర్చికు
ద్దాలింపంబడె నశ్వసైన్యగజయూథంబుల్ హరింపంబడెన్
గాలింపంబడి యెల్ల మూలబల ముగ్రం బాంధ్రసైన్యానల
జ్వాలాదగ్ధమయైన క్షాత్రపుని వంశజ్యోతి చల్లారగన్.

సౌరాష్ట్రేశ్వరు శేషదుర్గశిఖరాంచన్మౌళిభాగంబుపై
తారామార్గ మలంకరింపబడియెన్ త్రైలింగరాజ్యధ్వజ
స్ఫారోదంచితలోహితచ్ఛటల నాసాయంసమారంభ వే
ళారోచిస్సుల మందవాయుమృదులీలావీచికాశ్రేణులన్.

# మాధవవర్మ

## క్రీ. శ. 350

ఇతడు పల్లవరాజు. నేటి బెజవాడరాజధాని. ఇతడు బృహత్పలాయనులకు పూర్వుడు. శివస్కందవర్మాదులకాలమువాడు కావచ్చును. ఈ కథ ఒక శాసనములోనిది. అతని ధర్మమునకు మెచ్చి దేవతలు రెండుఘడియలకాలము విజయవాటికాపట్టణములో కనకవర్షము కురిపించిరట.

విజయవాటిక కోటవీధిలో నాడు సం
రంభంబు పొందుచు రాజభటులు
ప్రజ నొత్తుచున్నారు ప్రక్కప్రక్కలకు భూ
మీజాని యేకతనూజు డతడు
పదివేల దివ్య సువర్ణమ్ములనొసంగి
శ్వేతమత్తాశ్వముల్ విలిచినాడు
అవిపూన్చినరథంబు నారోహణముచేసి
అతడు పురంబు వాహ్యాళిపోవు
రాజపుత్రుడుకొన్న తురంగములవి
బహుళభద్రచిహ్నములు శుంభన్మహాగ్ని
వమదమోఘనాసాపుట భ్రమితసాంద్ర
ఫేనములు ఖురఘట్టితోర్వీతలములు.

గ్రీష్మవేళానిరాకృతిమేఘ గర్భఘూ
ర్ణిత వైఖరీ నేమి నిస్వనములు
చలితశైలాగ్రనిర్ఝరిణీవిధా భద్ర
జాత్యశ్వ దివ్యహేషాస్వనములు
కుద్దాలశాతోగ్ర ఖురవిఘట్టితధరా
చటులోద్ధత పరాగసంచయములు
మత్తక్రుద్ధాహి సంరావత్కశాగ్ర సం
చాలనోద్భూత నిస్వానకములు
మెఱుములుఱుములై వచ్చి నిమేషమంద
దాటిపోయె రాసుతుని స్యందనముకదలి
పుడమిఁ దచ్చక్రఘట్టితాంగుడయి నెత్తు
రోడికలుకట్ట నటఁబడియుండె నొకడు.

పరుగెత్తురథమువెంబడిఁ బ్రజల్ మూకలై
పెద్దయుఁబరుగులు వెట్టినారు
ఎచటఁబ్రజల్ మూగి రచటికేగిరిపోను
మఱి రాజభటులు సమ్మర్దమెడప
అరదంబువెనువెంట ననుసరింపక యేండ్లు
మీఱినవారు భూమీతలాన
ధూళిధూసరితమై వ్రాలిపోయినయట్టి
శవమును గనుగొని జాలిఁబడిరి.

అంతలో లోకబాంధవు డస్తమించె
అస్తగిరిగహ్వరాంత నిత్యస్థితాంధ
కార కృష్ణవర్ణాహిసంచారభయద
మై కకుప్పులు శ్యామలమ్మై తనర్చె.

*        *        *        *

పొడుపుమలవెల్గునెత్తాల పొడిచి దివ్య
కాంతి దిక్కులవెదఁజల్లె కర్మసాక్షి
ఉర్వినేల ధర్మాసనంబుండె నతడు
పల్లవేంద్రుండు మాధవవర్మనృపతి.

మృదుల కపోల పత్రముల మీదికి నుబ్బెడు కుండలమ్ములన్
పొదిగినరత్నదీధితుల మోసులు దాటి ప్రభాతనీరజా
భ్యుదయములైన దివ్య నయనోజ్వలదీప్తులు దాటి శీతరు
గ్వదనముదాటి ధర్మమయొకండు తదాస్యమునందుతోచెడిన్

కాబోలు నీమె శోకంబుకట్టినమూర్తి
అతిభూమిదుఃఖభారానతాంగి
కాబోలునీదుఃఖగత నిరాశాదేవి
పతితోర్ధ్వపక్ష్మలబాష్పనేత్ర

కాబోలు నీమె యేకతనూజవిరహిత
అతిదూషితశరీరగతనిరాస్థ
కాబోలు నీవృద్ధకాంత న్యాయార్థిని
బహుళక్రుధాభుగ్నఫాలభాగ
అనగ నొకవృద్ధ పేదరా లరుగుదెంచి
నెత్తురట్టలుకట్టిన నిజకుమారు
శవము దిగఁజార్చి చేతులుచాచి శవము
వైపు తనదృష్టి భూపతివైపు త్రిప్పి

ఓయినృపాల! యీబుడుత యొక్కఁడు నాదుకులంబు తేప నీ
వోలతిధర్మరాజు వయయో! ఇదియేమిటయా! గతాసువై
యీ యనుగేగెఁబో తినుటకేమిక నున్నది నాకునేమి నే
డేయిదె! వీనివెంటబడియేగెద కోడలికేమికావలెన్.

ఇంతకుమించి యాపదలికేమనికల్గు రథంబుచేతఁ ద్రొ
క్కింతురటయ్య భూప్రజల నెంతగనున్నసిరుల్ భుజింత్రు పా
లింతురురాజులైన నదలింతురుతప్పులుకల్గినన్ విచా
రింతురుకాక చంపుటసరే ప్రజనిట్టులకారణంబుగన్.

అని నీయిష్టము న్యాయమో మఱియునన్యాయంబో నీచేతిమీ
దనకానిమ్మిదె పోవుచుంటినని బాధాపూర్ణనేత్రద్వయం
బున నేవోవికృతస్వరూపఘటనంబుల్ గల్గి యావృద్ధయం
తన నచ్చోటగతాసువై పడియెఁ బుత్రాయల్లకాయాసయై.

ఆసమయంబునన్ నృపునియాననసీమ ప్రశాంతచిహ్నముల్
భాసురముల్ వెలార్చె నరపాలునితత్సభలోనివార లా
హాసముదీర్ణవక్త్రులు దృగంతవినిశ్చలవృత్తు లంతలో
నైశితదీప్తి వొల్చె నరనాథువిశాలవిలోచనంబులన్.

అధికృతులఁ బ్రాడ్వివాకులఁ
బ్రధానసచివులను చూచి వాక్పతినిభుఁడా
పృధివీపతి ధర్మోన్నతి
విధావినిర్ణయముచేయువిధి పనివెట్టెన్.

ప్రాడ్వివాకులును దీర్ఘముగ యోజించి స
మర్పించి రఖిలమ్మునధికృతులకు
మత్తాశ్వములుబూన్చి మనుజనాథసుతుండు
పురవీధులందునఁ బోవరాదు

పసిపాప లుందురు పంగ్వాంధు లుందురు
ప్రాణమ్ము ప్రాణమ్ము బదులుగోరు
స్మృతికి భూమిజానిసుతుడని కాదని
లేదు, నీతికిదయ లేదటంచు
ప్రాడ్వివాకులు పడు నభిప్రాయము పడి
రధికృతులు తీర్పువినిపించి రవనిపతికి
తీర్పువిని నంత సేపు ధాత్రిపతి మోము
కనుతుదలనైన కదలిక కాంచలేదు.

ఆకాశమధ్య సౌధాగ్రమ్మునను జేరె
నప్పుడే తీక్ష్ణమార్తాండమూర్తి
బ్రధ్నాంశు తప్త వాఃపధి కృష్ణవేణిక
ఇంద్రకూటపుటొడ్డు లెగచి మొరసె
కడగిమధ్యాహ్నశంఖాధ్వనుల్ పల్లవ
ఝ్మాతలేంద్రుల మొగసాల మ్రోగె
నాటికిధర్మాసనంబు చాలించె మా
ధవవర్మ ఆంధ్రపల్లవనృపాలు
డాసనమ్మున నృపతియున్నంతవరకు
నెంతగంభీరుడో డిగి యంత దుఃఖ
దళితచేతస్కుడైన ప్రధానసఖులు
రాజుగొని తెచ్చి రంతఃపురంబునకును.

సచివులు పుత్రశోకభరసంజ్వరు భూపతిఁజూచివారుతీ
రిచినదితీర్పు రాజు సవరించను వచ్చునటంచుఁజెప్ప న
య్యుచితవివేకి పుత్రవిరహోగ్రభరాత్ముఁడగాని న్యాయకా
ర్యచరణభారదుఃఖవివశాత్ముఁడగానని పల్కెవెండియున్॥

అసువులుపోవునంతవరకాపతి యేగెనుగాని పాపమే
కసుతవియోగదుఃఖితుఁడు, క్ష్మాపతిదేహము భూప్రజార్థమై
యసువుల నిల్పె నాటి దివసాంతమునన్ యువరాజుమేనిలో
నసృగుదితప్రవాహవలయంబులలో మలుసంజ వొల్చెఁబో

నటశివసాయంసంధ్యా
చ్ఛటాఘటానూపురమణిసంభవకాంతి
స్ఫుట'చిటచిటచిట'నినదో
ద్భటకనకము విజయవాటి వర్షముకురిసెన్

# వేఁగి క్షేత్రము

ఏ రాజు పంచెనో యిచట శౌర్యప్రాయ
సమ్ములు నాగుల చవితినాళ్ల
ఏ యజ్ఞసంజలో నెలమి పల్లవరాజ
రమణులు కాళ్లఁబారాణి లిడిరో
చిత్రరథస్వామి శ్రీరథోత్సవములో
తెలుఁగు పిల్లలు కత్తి త్రిప్పి రేప్రుదో
ఏ రెండు జాముల యినుని వేడిమి వచ్చి
కలసిపోయెనో త్రిలింగ ప్రభువుల
నాజగచ్ఛ్రేయసంబులై యలరు [illegible]
వేంగిరాజుల పాద పవిత్రచిహ్న
గర్భితమ్మైన యీ భూమిఖండమందు
నశ్రువులు జార్తి జీవచ్ఛవాంధ్రజనులు



ఇఁట వేఁగీశుల పాదచిహ్నములు [illegible]
స్ఫుటమూర్తిత్వమునై సంబంధప్రు [illegible]
ఘటికల్ గర్భమునం దిముస్ను [illegible]
టట లోకాద్భుత దివ్యదర్శనము [illegible]

నీయతుల ప్రభావ మహనీయత వేఁగిపురాధిరాజమా!
ఆయత ధర్మమూర్తులు మహాత్ములు వారలుబ్రహ్మకోశగో
పాయిత లాంధ్రపల్లవ నృపాలుర హుంకృతి వ్యాఘ్రగర్జగా
నై యరిలోకభీకర మహాద్భుత శౌర్యరసాకృతిం జనెౕ

ఈ నా పదార్పితక్షోణి నేరాజు ధ
ర్మాసనంబుండి స్మృత్యర్థమనెనో
ఈ నా దృగావృతంబైన భూములలోన
నే శౌర్యధనులు శిక్షింపఁబడిరో
ఈ నా శరీరమం దివతళించినగాలి
యెంత పౌరాతన్య మేచుకొనెనో
ఈ నా తనూపూర్ణ మైనయాకాశమ్ము
నేక్రతుధ్వనులు శబ్దించినదియొ
అస్మదజ్ఞాతపూర్వ దివ్యత్వమొప్పు
నీ పునీతావనీ ఖండ మిచట నిలచి
యస్వతంత్రత దారలు నాయాంధ్రశక్తి
నన్నుఁగంపింపఁ జేయుచున్నది భృశమ్ము

వేఁగి రాజ్యపు పల్లెవీధుల చెడుగుళ్ళ
రిపులఁ గవ్వించు నేరుపులు తెలిసి
ఎగురు గోడీబిళ్ళ సొగసులో రిపుశిర
స్సుల బంతులాడు శిక్షలకు డాసి
చెడ్డాడి యుప్పు తెచ్చి ననాడె శాత్రవ
వ్యూహముల్ పగిలించు నొజవుగఱచి
కోతి కొమ్మచ్చిలో కోటగోడల కెగఁ
బ్రాకి లంఘించు చంక్రమణ మెఱిఁగి
తెనుఁగులంతప్డె యవి నేర్చుకొనియయుండు
రెన్నగాఁ దెల్గుతల్లులు మున్ను శౌర్య
రసమొడిచి యుగ్గుఁబాలతో రంగరించి
బొడ్డుకోయని కూనకే పోయుదురట

శిలవోలెఁ గదలంగలేక హృదయస్నిగ్ధార్ద్ర సన్మానసా [illegible]
ఖిల చైతన్యుఁడనై పురావిదిత వేంగీపూర్వ సామ్రాజ్య గా
థల యోజించుచు నాంధ్రపల్లవ నగేంద్ర శ్రీయుత [illegible]
బలె నిల్చుంటిన యీపవిత్ర ధరణీ భాగంబునం [illegible]

ఏ దివ్య పూరుషు లీ శాద్వలాంకూర
శేఖరమ్ముల లిఖించిరో! యివెల్ల
ఈవాయువీచిలో నేయప్సరస్సమా
జము నింపిరో గీతిసముదయంబు
ఏ దివ్యశిల్పు లీరోదసీ కుహారాన
వ్రాసిరో దివ్య శిల్పంబులిన్ని
ఈ పథాంతరమునం దేపురాణ మునీంద్ర
సంతతులో ప్రశంసలు పొనర్త్రి
ఎటఁగనినఁ బూర్వపల్లవ నృపచరితలె
వ్రాయఁబడి పాడఁబడి గీయఁబడి యుపన్య
సింపఁబడి శ్రోత్రపేయమై చెన్నుదాల్చె
నీయతీంద్రియశక్తి నాకెట్టులబ్బె!
ఈ పొలాలెంత చేవెక్కించుకొన్నవో
గుండెవ్రయ్య సముద్రగుప్తుడడలె
ఈనేల పావిత్ర్య మెంత కుంభించెనో
చిత్రరథస్వామి సేవలు కొనె
ఇట పల్లవుల రాచమెలనాగ లేవ్రత
మ్ములు చేసిరో లచ్చి నిలుకడవడె
ఈకాశ్యపీఖండ మేశరజ్జ్యోత్స్నలో
పులకించెనో కీర్తి తెలుపులూరె

ఇట నెచట త్రవ్వినను బంగారేనట యది
యెంత శ్రీయొ యదెంత రాజ్యేందిరయొ ప
దానత నఖాగ్రపాత నిర్యన్నిధాన
మైన యీచోటనుపభోగ్యమయ్యె నేడు

ఈపాదలం జరించుచు నహీన మహామహిమాను భావనగా
నేపుర వీథులందో చరియించుచు నుంటినటంచుఁ బావనగ
త్ర్యాపతితుండనయ్యునుపురామహాబాంధ్రమునకా స్వతంత్ర్యుఁడనా
నేపురుషుండనో యనుచు నిభ్రమ సత్యముగా తలంచుచునా

ఏ పల్లవనృపాలు డెత్తిన బాపుటా
చాళుక్యనృపుల రాజ్యంబునందు
ఏ దేశికవిత పాలించిన కవిరాజు
నన్నయ్య వ్యాకరణంబునందు
ఏ యులిఁజెక్కు నేర్పేలు మహాశిల్పి
గోదావరీనదీ ఘోషయందు
ఏ తొంటి తెలుగుల యెక్కువాచారమ్ము
బలవన్నృపుల ప్రాభవమ్మునందు

సమసిపోయెనో - ఉన్మత్త సామజంబు
కొలను జొరబడి తమ్మితూడులను పెరికి
వైచునటు యెఱుంగుగాని తత్పద్మగర్భ
కేసర విమిశ్ర మధురసాగ్రియత గలదె?

ఇమ్ముగఁ గాకుళమ్ము మొదలీవరకుంగల యాంధ్రపూర్వరా
జ్యమ్ముల పేరు చెప్పిన హృదంతర మేలొ చలించిపోవునా
ర్ద్రిమ్మగు చిత్తవృత్తుల పురాభవ నిర్ణయమేని ఎన్ని జ
న్మమ్ములుగాగ నీతనువునఁ బ్రవహించునొ యాంధ్రరక్తముల్

ఇది వినిపింతునంచు మదినెంచెద మిత్రులకుఁ గళస్థ గా
ద్గదికము లోచనాంత బహుధారస్రుత భాష్పనదమ్ము స్పందనా
స్పద హృదయమ్ము నాపనికిఁజాలక చేసెడు నన్ను నింతగా
నెద పదిలించుకొన్న దిది యెక్కడి పూర్వపు జన్మవాసనో

# ముఖలింగము

ఇది గంజాం మండలములోని ఒక మహాక్షేత్రము. పూర్వము ఇది కళింగగాంగులకు రాజధాని. ఆరాజులే ఇచ్చటి శివాలయ ప్రతిష్ఠాపకులు. అనంతవర్మ చోడగంగదేవుడు పరాక్రమశాలి. అతని రాజ్యము గోదావరి మొదలు గంగవరకు వ్యాపించినది. వేములవాడ భీమకవి చోడగంగుని నాటివాడే. చోళ చక్రవర్తి గంగైకొండని యిద్దరు కూతుళ్లలో నొక్కతె రాజమహేంద్రనగరరాజు రాజరాజునకు రెండవయామె చోడగంగ దేవు తండ్రికిని భార్యలు. ఈవంశములో అన్యంకభీముడు మటీ పరాక్రమవంతుడు. ముఖలింగానికి వంశధారానది మూడు వైపుల నగరాన్ని చుట్టుకొన్నది. మేము కళింగోత్సవమునకు వెళ్లినప్పుడు వరదలుకట్టి మమ్ము కదలనీయలేదు.

దేవమాతృకలు వర్ధిత హేమకేదార
ఖండ పుణ్యము లిందు పండెనేమొ
తెలుగు కళింగరాజుల గుండె నెత్తురుల్
కడగి రణాదీక్ష కదలెనేమొ
శ్రీ గంధకస్తూరికా గురుద్రవ్యమ్ము
లిట దిగంతముల వాసించెనేమొ
శూర గంగైకొండచోడుతో నీచోటు
వియ్యాల బిగువులు బిగిసెనేమొ

దక్షవాటీపురీ కవిరాక్షసుండు
ప్రళయవహ్ని శిఖాధూమపటల మమృత
బిందుశైత్యల్య మొకవాక్కునందె యిచట
బిట్టు మండించి శీతలింపించె నేమొ.
ఈ చోటఁ దోలినాడు ప్రాచీసతి ముఖాబ్జ
మున నెఱ్ఱకుంకుమబొట్టు దిద్ది
ఈ నేలను కళింగభూనాథశౌర్యాన
లజ్వాల ధూమనైల్యములు క్రమ్మి
ఈ పవిత్రధరిత్రి నోపి త్రైలింగరా
జ్యశ్రీ సుధాప్రవర్షంబు కురిసి
కడగి యిచ్చటి మంటిగడ్డలు సైతమ్ము
నవమృగీ మదవాసనలు విదిర్చి
వేంగి విషయేశచాళుక్య విభులతోడ
మనసులో నన్నదమ్ములతనము నెరపి
మున్నిచటు తెన్గు రాణించుకొన్నదోటు
లీలమించిన యీ ముఖలింగ ప్రతిభ
ఆదినాల నెంతటి నిశితానురాగ
మగు కళాశిల్పములను విద్యలను చూడ
పగటి వేసాలకొరకు తూర్పార పట్టె
ప్రాణములను కళింగగంగ్రాజులైరి.

చిఱుత తరంగముల్ కలసి జీబులుకట్టిన వంశధారలో
తఱుముకువచ్చె తెల్గులప్రతాపశిఖల్ ముఖలింగనాథుక
న్నుఱిమిన నిప్పుకల్ సెగల నొక్కదినాన కళింగగాంగులే
లిరనిననాళ్ల నేటికవులే పొనువడ్డవి తెన్గు నిప్పుకల్

ముఖలింగ ప్రభురాజు ముద్దునవలా ముక్కంటి క్రొన్నిప్పుకల్
ముఖరీభూత వియత్పద భ్రమరితాంభో వంశధారాపయ
స్సఖ శైతల్యముచేత చెమ్మగిలి దీక్షాసంగృహీతప్రతా
పఖరాంశుల్ కుదియించుకొన్నయవి కావచ్చున్ మిథస్స్వర్ణచే

ఏ పాపమునకు తానీ ఫలంబబ్బెనో
అన్యంక భీమేశ్వరాలయమున
తెలుగుకళింగరాజుల జైత్రయాత్రల
గజరాజ యూథముల్ కదలువేళ
ముందీశివుండు నిప్పుకలు గ్రక్కెడుకంట
నెదిరి సైన్యంబు ముట్టించునంట
ఆ దేవదేవు దేవాలయంబున నేడు
గబ్బిలంబులు తిరుగాడఁజొచ్చె

ద్వారబంధాలపై వ్రాయబడిన తొంటి
తెలుగులిపి పోల్చుకొని కూడబలుకుకొనెడు
నా మహామాతృదేశ బద్ధానురాగు
లెవరో నాగుండె నెత్తురు లిట్లుకదుప.

ఏపరజన్మలో కలసి యేమొక తల్లియు బిడ్డ లైతిమో
నాపయి నీధరాస్థలికి నాటిన ప్రేమము దెంత యోకదా
తేపకు వంశధార పరతెంచి దిశాఖిలమార్గరోధియై
యీపయనమ్ము నన్ను చననీయక నిల్పుకొనెః తనంతటః.

కడలముట్టిన కళింగ జ్యోతి యోడిన
చమురు బొట్లా మ్రేడితములు నెరపి
తెలుగు కళింగరాజుల గుండెలో నెత్తు
రులకు పౌనః పున్యములు ఘటిల్లి
తెలుగుపొలాలు బోదెలు త్రవ్వుకొన్న కా
లువ శైవజటవారి ప్లుతముచూపి
ఈ వంశధారామహీయ స్తరంగ పా
ధః ప్రవాహముల కథ్యాహరించి

నాహృదయసీమలో నస్పృజ్ఞానిగర్భ
పథములంబడి యొరసి ప్రవాహమేచి
యూగి బుడగలు బుడగలై యుబికి వచ్చి
నాకనుల తుట్టతుదలలో నాట్యమాడు.

పాడినగీతమే మరలపాడెదఁ గూడినభావమే మరిం
గూడెద నేమిసేయవలె గుండియశోషిలి దుఃఖవేదనన్
గాడిన నా హృదంతరముఖంబున మాంతోలినాటి కీర్తిరా
పాడిన నాదువాక్కు తెగబాఱదు నూత్నపథాల వెంబడిన్.

ఈ పొంగెత్తినవంశధార మరియిట్లే పొంగులై పొంగులై
నాప్రాణమ్ములు దేహమీ జలములోనన్ ముంచుకోనిమ్మయే
యేప్రారంభము లేని యీ తెనుగులిట్లే గూఢసంవర్తవే
ళాపర్యంతము నుండనిమ్ము విధియేలా మారు మాకోసమై.

నాజాతి పూర్వప్రథా జీవరహితమై .
శక్తి నాడులయందు చచ్చిపోయి
నామాతృభూమి తేజోమహశ్చ్యుతిని బ్ర
హ్మక్షత్ర తేజంబు మంటగలిపి

నామాతృభాష నానాదుష్టభాషల
యాథార్థ్యమును తలనవధరించి
నాతల్లి నేల నేనాటివాచారముల్
పై మెరుంగులు చూచి భ్రమసిపోయి
ఏమి మిగిలిన దీనాటి కిట్లు పొంగు
లొలయు వర్షానదీ గభీరోదకముల
దైన్యగర్భ చారిత్రముల్ దక్క భిన్న
గిరిశిఖర దుర్గ పరిదీన గీతి దక్క

ఇచటి 'నాగావళీ' ప్రచురవర్షాంభస్త
రంగముల్ 'వంశధారా' జలములు
తరగెత్తిన 'మహేంద్రతనయా' సుపాథస్సు
లొకరీతిగా పొంగి యుబికిపోయి
'గౌతమీ కృష్ణవేణీ' తరంగములు తా
రాధ్వమ్మునందు నైక్యము భుజించి
'గుండ్లకమ్మ' జలాల గుబురులో గుబురులై
'పెన్నా' తరంగముల్ పెరిగిపోయి

తెలుగునదులెల్ల పొంగెత్తి ప్రళయవారి
కెరలిపడి తెన్గునేల ముగించనిమ్ము
నేటితో నస్వతంత్రతా నియతమైన
యీ బ్రదుకు తెన్గువారు భరించలేరు.

# నన్నయభట్టు

## ఆంధ్ర భారతావతార ఘట్టము.

శ్రీ గోదావరి నాంధ్రశైవలిని రాజీవమ్ము కించిత్స్మిత
ప్రాగల్భ్యమ్ములుచూపెనయ్యుదయమార్తాండాంశుసంస్పర్శఁబ
ద్రాగారమ్మను కార వెల్వడి స్వతంత్రమ్మైన గీతమ్ము నా
శాగంధానిలవీచిఁ దేల్చినది గీస్స్రమాట్టు భృంగ మ్ముగన్.

ప్రతివాదిప్రళయుల్ త్రయీనిధులు తత్రాపాతర్వివస్వత్ప్రభా
హ్రాతకేశాంతని మజ్జనాంబుచయు లుర్వీదేవతల్ త్ర్యంబక
ప్రతిముల్ కుండలదీప్తకర్ణయుగళుల్ వస్త్రాద్యలంకారభూ
షితులై బ్రహ్మలవోలికన్ నడచి రాస్తిక్యప్రధానాంగముల్.

చనిచని రాజపట్టణవిశాలపురథ్యలవెంబడిన్ సభా
జనములు పెక్కురాజులును సైన్యపతుల్ సచివాదు లంతకున్
మునుపె ప్రవేశమై తమసమున్నతపీఠము లావరించి యుం
డినసభ చొచ్చి యందు తమనిష్ఠిత పీఠములందు చేరగన్.

ఆజానులంబమానాంభోజనాళ బా
హాదండముల నంద మైనవాని
భసిత త్రిపుండ్రాంక ఫాలభాగమునఁ జం
ద్రార్ధశేఖరు ప్రతి యైనవాని
నిత్య గోదావరీ నియమ వేళాకృత
స్నానమ్ములఁ బవిత్రు డైనవాని
ప్రౌఢాంధ్రవిజ్ఞాన భాషా మహాదేవి
కావాస మైనయాస్యమ్మువాని
వచ్చుకవి నన్నభట్టుని వాఙ్మయంత
నెదురుగా బోయి సచివాదు లెరగి తేగ
సముచితాసనమున శబ్దశాసనుండు
ఉదయశిఖరి మార్తాండుడై యొప్పమెఱసె.

ఆయన వేదవేదాంగ విద్యారాశి
సత్తపోజిత పయోజాతయోని
ఆయారుగురు వార లారుశాస్త్రములకు
మూలకంబములు గీర్ముఖరముఖులు

అఖిల భాషా కవితాధినాథుండు నా
రాయణ భట్టు తీవ్రమతి యతడు
గణితశాస్త్రాంభోధి ఘను డాతడే పావు
లూరి మల్లన కవిలోకగురువు
అందఱను జూచి పరిచయ మందహాస
చంద్రికలఁ జిమ్మె నాంధ్రభాషానియంత
అంతలో వినవచ్చె రాజాగమనము
తెలుపు మాగధసౌవిదల్లుల పొగడ్త.

జయకుండవాంబాప్రజా! రాజమార్తాండ!
త్రిభువనాంకుశ! జయశ్రీమనోజ!
అమ్మంగదేవీ హృదంభోజమార్తాండ!
రాజమహేంద్ర విభ్రాజబిరుద!
పరగండభైరవ! బిరుదాంకభీమ! స
త్యాశ్రయ కులశేఖరా! సమస్త
భువనాశ్రయ! త్రిలింగ భూమీ మహాభార
వహన బాహాదండ; పార్థివేంద్ర!

జయజయ' యటంచు బిరుదులు చదివినారు
వందిమాగధ కంచుకుల్ సుందరంపు
కంఠముల తేనెవాక లొల్కంగ సభికు
లందఱును లేచినిల్వ బద్ధాంజలులయి.

సమదేభాస్తరణంబు డిగ్గి ప్రణుతోత్సాహంబునన్ వచ్చె ను
త్తమచాళుక్యుడు విష్ణువర్ధన ధరాత న్వీమనోహారి వి
క్రమదంతావళసుందరమ్ముగ జయారావమ్ములన్ సల్ప మం
దమృదుస్వాదువచోనిగుంభనల నందంబొప్పగా మాగధుల్.

అరుగుదెంచి బృందారకేంద్రాభుడైన
రాజరాజనరేంద్ర భూరమణు డంత
సకలఋషిసేవ్యు డగుశచీజాని వోలె
ప్రౌఢి మెఱసె చింతామణీభద్రపీఠి.

'ఆంధ్రచళుక్యవంశావనీనాథుల
రాజధానుల హజారములనుండి
హరిదంత దంతావళానేక కర్ణని
ర్భేదచండము రణభేరి మ్రోగ

ఘుర్ఘురించిన మహాక్రూర ఘోణిపతా
కాజృంభణమ్ముల కలతఁజెంది
సప్త గోదావరాతృప్త భీకరఘోర
కుపిత రావములకు గుండె పగిలి
యున్న శాత్రవతతి చళుక్యోర్వీనాథ
కృత్తదండ కారణ్యంబు స్మృతికి తగిలి
దాగుకొనుచోటు కనరామిఁ దల్లడిలిరి
యింతలగు బాలకుల చంక కెత్తికొనుచు,

అని కవిబట్టు సర్వకవితాధిపు నన్నయభట్టు వంక చూ
చిన చిఱునవ్వు మెచ్చుదల చిన్నెలు నన్నయగారి యాననం
బునఁ దళుకొత్త సంతసిలి పోయెను ద్వారమువద్దకుఁ 'బళీ
యని పొగడెఁ సభాస్థలి ధరాధిపుమోమున నవ్వు రేగఁగఁ

ఆహితాగ్నులు సమంత్రాక్షతలం బూని
యాశీస్త్రియాపార మనిరి నోట
విమలదేశాక్షి సావేర్యాది సౌమ్యరా
గములు పాడిరి గాయకవ్రజంబు

ఆరుశాస్త్రముల వాక్యార్థమ్ము చేసిరి
శ్రవణపేయముగ దోషజ్ఞవితతి
భారతార్థమ్ముల బహు సంహితామర్మ
సిద్ధిచూపిరి విపశ్చిన్మఘువులు
చంద్రవంశ్యు డౌరాజరాజక్షితీంద్రు
హృదయపద్మమ్ము ప్రహ్వీకరింపఁబడియె
భారతార్థగుంఫనముల పలికె నిట్లు
క్షోణిపతి నన్నపార్యుపైఁ జూడ్కి నిలిపి

ఇవి యేనుఁ సతతంబు నాకును గరంబిష్టంబు లైయుండుపా
యవు భూదేవకులాభి తర్పణమహీయఃప్రీతియుఁ భారత
శ్రవణాసక్తియుఁ బార్వతీపతి పదాబ్జధ్యాన పూజా మహో
త్సవముఁ సంతతదానశీలతయు శశ్వత్సాధు సాంగత్యముఁ

హిమకరుదొట్టి పూరు భరతేశ కురు ప్రభుపాండుభూపతుల్
క్రమమున వంశకర్తలనగా మహి నొప్పిన యస్మదీయ వం
శమునఁ బ్రసిద్ధులై విమలసద్గుణశోభితు లైనపాండవో
త్తముల చరిత్ర నాకు సతతంబు వినంగ నభీష్టమెంతయుఁ

ధారుణి నీకు మిన్న కవితానవపట్టము కట్టుకొన్నవా
రే రని సాభిలాషములు దృక్కులు చాచినయంత వేద గం
భీరవచోనిగుంభనల మేలిమిచేఁ జిలుహొన్ను గంటలుఁ
బోరుకలంగ నన్నయ ప్రభుఁ తగ దీవనచేసె నీగతిఁ

అశ్రమసాధ్య మైననిఖిలావని దేవహితంబుకోసమై
ఆశ్రితపక్షు లైన భవదన్వయ పూర్వనృపాలు రేలి వ
ర్ణాశ్రమ ధర్మముల్ నిలిపి రాకులమందున పుట్టినట్టినీ
కశ్రమ సాధ్య మైనయవి యాశశితారక కీర్తిచంద్రికల్!

అనెనో నన్నయభట్టగీష్పతి సుధాస్యాంభోజ రేఖాంతరం
బున రాకానవశారదేందు కిరణంబుఁ బోలె నైనట్టిమిం
చున సాహిత్య సరస్వతీ ప్రణుత తేజోలేశ మొక్కండు తో
చెను వర్షించెను సర్వదైవత కరోత్సృష్టంబులై పుష్పముల్

'శ్రీవాణీగిరిజా శ్చిరాయ' యను నాశీఃపూర్వకారంభవా
క్శ్రీవైదగ్ధ్యమునందు మ్రోగినది తంత్రీనిస్వనం బొందు గో
దావర్యాపగలోని భంగములయం దావృత్తులం జూపి గీ
తావేశంబున తెన్గునేల తనుదానై ముక్తి చూడాడగఁ

# ప్రోలరాజు

## క్రీ. శ. 1140

కాకతిబేత రాజునకు ప్రోలరాజు కుమారుడు. ఇతడు రాజ్యతంత్రజ్ఞుడయిన మహాయోధుడు. ఈ కథలో చెప్పబడిన యంశము లన్నియు నితడు జరిపినవే.

## కల్పన

శకయవన హూణులబాడు లెక్కువ యయిన యారోజులలో నాంధ్రదేశము చిన్న చిన్న రాజ్యములుగా నుండుటచేత పరు లరుదెంచి నప్పుడు తెనుగు రాజులందఱు తమ సైన్యములను కలిపి యుద్ధముచేసిన బాగుండునని ప్రోలరాజు సభ గావింపించెను. మంత్రకూట పురాధీశ్వరుడయిన గుండరాజు దీనిని భగ్నపరచెను. తరువాత ప్రోలరాజు వాని శిరస్సు తెచ్చి తనకోట గుమ్మమున కట్టెను. కాకతిప్రోలుని కాలములో చిన్నదైన కాకతిరాజ్యము విశాలమై భావిమహాదశకు తగినంత వైశాల్యము గలది యయ్యెను.

అంసంబందున బారుటీఁటె నిడి నేత్రాంభోజముల్ భావ తీ
క్ష్ణాంశుల్ జిమ్మగ ధాత్రి పాదహతికిఁ గంపింపగా క్షత్రియో
త్తంస[illegible]క్కఁడు హన్మకొండకెలనఁ దారాడె తానొక్కసా
యంసంధ్యా సమయంబునందున లలాటాకుంచితవ్యగ్రుడై

"నాఁడే మజ్జనకుండు వైరినృపకాంతారమ్ము ఛేదించుచోఁ
గూఁడందీసెను గాని బాసటని యాగొడ్డళ్లచే నేమిరా
పాడంజాలడు మంత్రకూటపతి యారా! గుండరా జెంతయా
టాడెఁ త్రైలపదేవు డింతకును బాహాగర్వహీనుం డగుఁ

త్రైలపదేవుడైన నొకదారికి వచ్చెడువాడ యేమి యె
వ్వీలుననైన నాహుతికి వేచినవారల యెల్ల రెప్పు డే
నాళులనేమొ కాలహరణం బొనరింపమి మేల యాను చే
గాలిన వెన్క నాకులని గంతులువైచుట పాడిలేమికిఁ

తెలుగు చళుక్యరాజుల ప్రతిష్ఠలతో సరిగాగ వారిదో
ర్బలమును సన్నగిల్లినది వారిక పూర్వపుపేరి సవ్వడిఁ
నిలుపుకొనంగజాల రవనీస్థలి పంచుకుపోయి యింత ము
క్కలయిన వెన్కహూణులకుగాగయికోలొనరింత్రొయేమొకో!

ఉత్తరభూములఁ యవనహూణుల మందలు చెల్లరేగి రా
యొత్తిడి వింధ్యదక్షిణపు టూరుల కల్గైనయేని నేడిటుఁ
కత్తులగోడ కట్టగల క్ష్మాపతి యెవ్వడు సూర్యవంశరా
హుత్తులమీద వచ్చిపడదో యపకీర్తి యెదిర్చకుండినఁ

పసు లరుదెంచినఁ గల నృపాలురు నల్వురు కూడి వారిపై
నరుగఁగరాదొ యెవ్వరికి నబ్బినవారిక యంత యెంత దోః
పరిణతశక్తి రాజసభ భగ్నముసేయునొ గుండరాజు త
చ్ఛిరమున మత్పదం బిడక చేవయనఁ గలదే ధరాస్థలిఁ!

అసలది కాదు లోన కలయట్టి తలం పిత డేమి భూమిరా
డ్వాసరమునంతయుఁ సభకు పిల్చుటయే మరుదెంచుటేమి వా
ర్వొసగఁగ చేయుటా యనియ పుట్టెను తొల్త సదూహయే బలే
యొసపరియూహ బాగుపడునూహయె? తెన్గుల తేల్చునూహయే?

ఆయతమై ప్రశస్తమగు నాంధ్రచళుక్యకులావనీరుహ
చ్ఛాయలలోన తెక్కగమి చాచినవారము వారిమీద నే
యాయితమా యనంగ నిసుమంతయు తైలపదేవు డెంచ డా
కోయతలంపు గుండపతిగుండియ గ్రుచ్చక యూటి నిల్చునే?

తనశౌర్యంబది యెంత రాజులసభఁ దా నెంత యెం తెంత యో
చనఁ బారలుచాచె తద్విపులవక్షంబుఁ బ్రభేదింపకుం
డిన శ్రీకాకతిదేవి పాదములయందే మోపలే దీ శిర
స్సను రేపే శుభలగ్న మాంధ్రవిషయేశుం డెవ్వడో తేల్చెదఁ

శైలపదేవు బందిగొని తత్కాలమందలి మాకృతజ్ఞతా
మూలముగా వెసఁ విడిచిపుచ్చెద నాపయి గుండరాజుపై
వ్రాలిన నాకు నడ్డమయి రాడత డప్పుడుగాని కాకతి
ప్రోలు డనంగ నేమొ తలపోతలు సాగవు గుండరాజులోఁ.

అగు గోవిందుడు శైలపేశ్వరుని సైన్యాధీశ్వరుం డేటికిఁ
పొగ రేగించెడు రేగజేయునెడలఁ భూమీశవిధ్వంసకం
బగు శ్రీకాకతివీరశౌర్య దహనాహంకారకీలఁ హవి
స్సగు సాగించెద కాకతీయనవరాజ్యశ్రీవినిర్మాణముల్'

*

ఆయుద్రేకముచేత భూమిపతి స్వీయాంగంబు లుష్ణంబులై
సాయంకాలము లుప్తమై తొలిదెసఁ చంద్రోదయంబైనన
వ్యాయోగంబునుబోలె తత్కిరణసాంద్రానంత శైత్యాకరే
ఖాయోగంబునచేసి చల్లపడి సౌఖ్యంబయ్యె నొక్కింతలోఁ.

అంతట రాజు దుర్గసముపాంతము చేరగ బంటు లొత్తిగొం
చెంతయు నమ్రులై పథమునిచ్చిరి యెచ్చటికేగి యొంటిగా
నింతటి ప్రొద్దుపోవువఱ కేనియు రాకని కొంద అందులో
మంతనమాడినారు పతి మందగతిఁ చన వెన్క తట్టునఁ.

కాకతికన్నుదోయి తెలికల్వల కాంతులలో ప్రసన్నతా
శ్రీకత దాల్చె నాటినిశి తేనిసభక్తికమైన పూజలన్
తే కడముట్ట విన్నపడె నరిందమమై దెసలందు జైత్రయా
త్రాకకుదంబు నిన్సహాణరావము భీకర మన్మకొండపై.

# ప్రోలరాజు వధ

మొదటి ప్రతాపరుద్రుడు ప్రోలరాజుకొడుకు. ఆరోజులలో మత వైషమ్యము మెండు. జైనమతము నశించుచున్నది. కొద్దిరోజులక్రిందనే బసవేశ్వరునిమత ముద్భవిల్లినది. దానికి తరువాత కొద్దినాళులలోనే పాల్కురికి సోమనాథుడు బసవపురాణము వ్రాసినది. ప్రోలరాజు మొదట జైనుడు, జీవితాంతమున శైవుడైనాడు. మొదటి ప్రతాప రుద్రుడు వీరశైవము నంది మిక్కిలి తీక్ష్ణస్వభావుడై యుండెను.

మొదటి ప్రతాపరుద్రుని కాలములో కాకతీయరాజ్యము మహోన్నతమైన స్థానము పొందెను.

'ఓహో చాలును బేలువోక కుమతవ్యూహంబులం జిక్కి నీ
యూహల్ మానెదరోయి సాంబ కరుణావృష్టిం విలోకించెదం
హాహారిం నిను దేవదేవు డనలే దుగ్రాక్ష! నీభక్తిలో
సోऽహం మార్గము పోదు నాస్తికత యెట్లోర్వంగ నాచెప్పవే.

చెడుతలపుల్ ఫలించె శశిశేఖర వేదములెల్ల మిధ్యలే
మృడ నిగమాంతగోచరుడ వీవాకరుండవె యెంతమందియే
ర్పడిరి మతప్రవక్తలు శివా! ఋతమార్గముపొంతవోవ డొ
క్కడు నిక నేమికావలె నకాలపువానము నీక యబ్బెహో

చాలుఁ మానము మించివచ్చినదిపో చక్షుఃశ్రవోభూష క్ష్మో
ణీలీలారథ అస్థిహార శివ కంఠేకాల మృత్యుంజయా
శూలీ దుష్టమతాంబువాహములు మించుఁ సన్మతాజ్ఞాప్తతే
జోలుంటాకములయ్యె నీ ముదల వేచుఁ భృత్యుడీశా ప్రభూ.'

అనుచు ప్రతాపరుద్రుడు శివాయతనంబున ధ్యానమగ్నుడై
మనమున వీరశైవశిఖ మంటలుగ్రమ్మగ మీలితాక్షుడౌ
చు నిలచె బద్ధహస్తుడగుచుఁ పరిశుద్ధత నంది యొద్ద త
జ్జనకుడు ప్రోలరాజు శివసన్నిధికిఁ చనుదెంచె నత్తఱిఁ

ఆరబ్ధేశ్వర తాండవభ్రమణపాదాంభోరుహ ప్రస్తమం
జీరంబో గగనేందిరా కరపత్రచ్ఛికందుకంబో పునస్
స్వారాజ్యచ్యుతభుక్తపుణ్య మగునక్షత్రంబో నాఁ బశ్చిమా
శారత్నాకరమందు గ్రుంకెను వివస్వద్బింబ మల్లంతలో.

ఆరాజేంద్రుడుప్రోలభూమిపతి పశ్యత్ఫాలుసాన్నిధ్యముఁ
చేరంబోవగనుత్తరీయపుకొనల్ జీరాడ తద్వస్త్రవి
స్ఫారీభూత సమీర సంహతుల కోపజ్వాల పేర్చుఁ మహా
క్రూరాభ్యుత్థిత లేలిహానమన సం రూఢోగ్ర రోషాత్ముడై

పెగులుచు కొన్న సాహసి పవిత్ర హుతాశనదృజ్మతంబుపై
పగగల యెవ్వడో నిజతపః పరిశుద్ధత కల్మషంబు చే
యగతను ముట్టవచ్చెనని యాగ్రహ ఘూర్ణిత తారకాక్షుడై
భగభగ మండిపోయి పితృవక్షము గ్రుచ్చెకరాసి నుగ్రుడై

అలనిముసంబులోన పితృహంత కకారణ కోపపావకో
జ్వాల పరిణామముల్ తెలిసివచ్చెను మిన్నును మన్నునేకమై
తల తిరుగంగమూర్ఛపడి తండ్రిపదంబుల యొద్దనంతలో
తెలిసి వృథానితాంత పరిదేవనముం బొనరించె నీగతిన్.

'నీ బాహాధనురగ్ర యాయులయితండ్రీ! తెన్గులాశాంతముల్
రాఁబోగా నసివాళ్లు జేసికొని రుగ్రంబైన నాబాకు క
ట్టాబాధంబుగ నాకె నీయెడద ఘంటామార్గముల్ శత్రురా
ట్ప్రాబల్యంబుల నింకఁ గట్టువడవో రాజన్య చూడామణీ

హా! హా! యెంతటి క్రూరకర్మమునకేనైతిన్ శివా! తండ్రి నీ
బాహా నిర్జితులెల్ల భూమి పతులప్పా! యట్టినీవెట్లు తే
జోహీనంబగు నాకరాసి బడితీ శోకాఘముల్ పేర్చిపెన్
దాహంబై పొరిఁగాల్పవేమిటికి వధ్యస్థానయోగ్యున్ ననున్.

ఈ పితృహంత వీడటవె యీపయి కాకతిరాజ్య భోక్త యీ
పాపము పేరుగా ప్రళయ పావక కీలలునన్ను మ్రింగవో
రా! పరమేశ! తండ్రి రుధిరమ్మునఁ దోగిన చేతులన్ ధరి
త్రీ పరిపాలనమ్ముగడి దేరిన దే! యికనే నష్టుడన్.

ఆయమ నిల్వ నీడయిన దచ్చట కాకతి రాజ్యలక్ష్మి యా
నీ యెదుటొమ్ము హీనుడను నీచుడఁ జేఁజుట కత్తిదింపి తం
డ్రీయని పిల్చుచుంటి త్రపయెంతగ మాలిన వాడనన్ క్షమిం
తే యమ పట్టణంబునకు నిప్పుడ పంపగ యోగ్యుడన్ జుమీ

గర్భంబందున తీపి నాపయిన వేగన్నుల్ ప్రసారింతువే
నిర్భాగ్యుండునినున్ హరించెగద తండ్రీ న్యాయమెందున్నదో
నిర్భిన్నమ్మును గాదు దేహమసువుల్ నిర్యాతముల్ గావు నా
దౌర్భాగ్యమ్మున కంతులేదుగదె యో త్రయ్యధ్వగోపాయితా

ఈకృత్యంబునచేసి వైరినయి యే నెట్లేగి దర్శించెదన్
నాకన్నన్ బితృహంత యెవ్వడు నవాంధ్ర శ్రీమహారాజ్య ల
క్ష్మీ కల్యాణవతీ సపత్నియయి లక్ష్మింబోలు నాతల్లినా
శోకామంగళ మూర్తి నేవిధమునన్ జూతున్ వచింపంగదే,

అని మూర్ఛిల్లిన వీరరుద్రుని స్వకీయామాత్యులా రీతిగా
జనకుఁ బాపిరి తేనికిఁ దహన సంస్కారమ్ము గావించిరా
ఘనుడౌ రుద్రనృపాలు జీవితములోఁ గన్పించనేలేద టా
తని యాస్యాంచల సీమలందు నవమందస్మితాంకూరముల్.

# చంద్రవంక యుద్ధము

ఇది పల్నాటిచరిత్ర లోనిది. అనుగురాజు పల్నాటికిరాజు, అతని మంత్రి దొడ్డనాయునికి బాదన్న బ్రహ్మనాయడు కొడుకులు. బాదన్నకు పెద్దన్నయని కూడ పేరు. బాదన్నను అనుగురాజు పెంచుకున్నాడు. కనుక నలగామరాజును బాదన్నయు అన్నదమ్ములు. నలగామరాజు అనుగు రాజు నౌరసపుత్రుడు. అలరాజు నలగామరాజునకు నల్లుడు. అందుచేత బ్రహ్మనాయడు బాదన్నలకు నలరాజునకు మామా అల్లుళ్ళ వరస. అలరాజునకు రాచమల్లు అలరాచమల్లు అనికూడ పేర్లు. అలరాజు గుర్రముపేరు సవరాల గోడిగ, బాదన్న గుఱ్ఱము కొరుబొల్లుడు. బాదన్న, బ్రహ్మనాయుడు వెలమలు. అలరాజాదులు క్షత్రియులు.

బ్రహ్మనాయడు చంద్రభాగా సరిత్తీర్థ
మందు ప్రాతస్స్నానమాచరించి
బాల సూర్యోదయ ప్రభలు గోదుమవన్నె
పసిత్రాచుకానల పగిది లేత

పిల్ల తెమ్మెరల కంపిల్లు చిన్నారి పిల్ల
యలలఁ జర్రున జారులాడుచుండ
నిలువు టద్దమ్ములోపలదిరుమణితిరు
చూర్ణమ్ముదిద్దనిల్చున్న వేళ
శారదాకాశమున రెండు సాగి క్రొంద
నమ్ము మెఱుపుల సంఘర్షణమ్ము వోలె
నిలువుటద్దాన ధగధగ్గై నిగనిగ్గై ని
మేష పరికల్పితోద్దీప్తి మెఱుపుకలిగె

నిలువు టద్దమ్ము చేఁబూని నిలచియున్న
తన కుమారునిఁ గన్నమదాసు చూచి
భాగ పైతట్టు నెవ్వరో ద్వంద్వయుద్ధ
మాడుచున్నారు చూచి రమ్మనుచు బంచె

పరుగులఁ బోయినాడతడు పర్వులవెంబడి వచ్చి నాడు క్రొ
న్నురుసులఁగ్రక్కు గుర్రముల నూకెదరడ్డము బాదనాయడుఁ
బోరి నలరాజునంచు తనపొంగిన చట్టలు పట్టుచుఁ కనుల్
గిరగిర త్రిప్పుకొంచు పలికెఁ త్వరయాకృతి పొందెనోయనఁ

అటఁ దిరుచూర్ణముఁ నిలువుటద్దము బంగరుచెంబువీడి త్రో
క్కటపడు చొక్కటే పసుగుగాఁజనె నచ్చోటు బ్రహ్మనాయడ
ట్టిటు నొకదానిపై కరుచు చేచి పెనంబడు కారుబొల్లనిం
తట నవరాలగోడిగ నదంతట నాపెను మధ్యనిల్చుచుఁ

కారుబొల్లని ముఖాగ్రమ్మున హేమకం
కణ రమ్య దక్షిణకరముసాచి
నవరాలగోడిగ నవఘంటికా లగ్న
గలసీమపై సవ్యకరమునుంచి
బ్రహ్మనాయడు వారి బవరమ్మునాలింపు
డని మాటపెట్టెనంతన, తనంత
కారుబొల్లడును వెన్కకుఁదగ్గె నవరాల
గోడిగ యతని నూటాడి త్రోచె

బ్రహ్మనాయని లోపలి భావగర్భ
మందు నేమూలనో తెలియంగ బడక
లోనగలగనో పొరగాలిలేని సరసి
సరసిజములట్లు స్తిమితలోచనము లొప్ప

'అల్లుడా! ఆగరాదయ్యా! అనియె నతడు
'మామ! నాకత్తి యొరవీడి మరలి పోదు
బలి యెఱుంగక, యని రాచవాఁడు పలుక
'నంతకసకేల' యనుచు నాయఁడు వచించె

నవరాలగోడిగ సాగించుపరవళ్ల
కలరాజు కళ్లెమ్ము నాచిపట్టి
అదలించి జీనుపైనదిమి కూర్చుండి బా
రున రికాబునఁ గాళ్లుత్రొక్కిపట్టి
అలరాచమల్లు నాయనిఁ జెప్పఁదొడఁగె
'మామా! యిద్దినెలనాళ్ల మాట యన్న
లింగధానకుడును గంగధానకుడు న
శ్వముల నీరముదాపజంద్రవంక
రేవులో గుఱ్ఱములు తీయునీవు నీవ
టంచు పంతాలువోయి యంతాగ కొకడా
కడుగ చబుకులు విసరుట కడకు వచ్చి
గోడిగకు దెబ్బవచ్చి కన్నుచిద్దుతాకె

మగసిరి నాడుగా చనిన మాదిరిగా హయశాలలోన గో
డిగ నిలుచుండి కన్నులబడిన్ తెగఁగార్చునునీరు ముట్టియన్
బగడపుతొట్టెతో జలముపట్టిన గిట్టదు లేతచొప్ప క్రొ
న్నిగల కొసందియిచ్చినను నెట్టదువాయికి గాటమాకసిన్

బవిరి గడ్డముతోడి బాదన్నబొమ్మ పెం
డారాన నేనొకనాడుచెక్కి
గోడిగగిట్టపై కొన గజ్జియల మువ్వ
లందెతో బిగియించినంతనుండి
దానికిఁ గసితీరెఁగాన నీరమునాను
సకిలించుకొంచు చొప్పకొనలంటు
ఆపైన మూన్నాళ్ల కలగోడిగకు
బొడ్డుగంటకట్టి రికాబుగవ్వకట్టి
నడుము పట్టకట్టి కొడుపుగంటలమ్రోగు
హొన్నుజీనుకట్టి యుర్వీరాజ
సభకురాగ చూపుసారించి బాదన్న
యందెకొణిగె బొమ్మ నది మెఱింగ

బట్టుమాటగ బొమ్మకట్టు తీయుమటంచు
కబురంపె బాదన్నగారు నాకు
ఔద్ధత్యసహితమౌ నామాట నేనోర్వ
లేదు పోటుకురానె లేవయేని
యల్లేయటంటి తానప్పుడునిశ్చయ
పరచె బాదనచంద్రవంకపచ్చ
గడ్డలపై నేడు కలయగా
గారుబొల్లనిపైన ముందు వచ్చినది యతడు
కారుబొల్లనిమెయి నలంకారమరయు
చూడు సవరాలగోడిగ కూడ బొమ్మ
కాలు ముందుకు చాచెడు గర్వరేఖ
మామ! నాకత్తి బలిలేక మరలిపోదు,

బ్రహ్మనాయడాలోచనా పదము నెల్ల
కొసల తిరుగాడుచున్నట్లు కొంతసేపు
శిరమువాలిచి మరికొంతసేపునకు శి
రమ్మునెత్తి గాంభీర్యముద్రాముఖుండు

కన్నమ! నీవుపో. అరటిగడ్డలు దవ్వాలు కొంచురా! యటం
చున్నటి యానతిచ్చె బాలసుల్ గనుగ్రుడ్డునరాల కుబ్బగా
కన్నమదాసు వాయుపథగామిగ పట్టణ మాభిముఖ్యమై
చన్న హయంబు పెద్దన వెసన్ డిగి తమ్మునియొద్ద నిల్వగా

అలరాజుదిగడు గుర్రము
కొలకొల పరవళ్లు త్రొక్కు గోడిగ పెను త్రొ
క్కుల భాగ పచ్చగడ్డలు
తెలిపాడిపై నేలగిట్ట దిగి దుమ్మెగయున్

కన్నమదాసు వే నరటిగడ్డలు దవ్వాలు తెచ్చె నాయుడున్
తిన్నగ చేనుగా ధరణిఁదీరిచి పాతెను వానినెల్ల మ
ధ్యన్నిలఁబెట్టె నొక్కరటిదవ్వ వెసన్ దనపేర తేజిపై
నున్నలరాజు 'నల్లుడయిదో' బలివేయుమనెన్ ద్రుతోక్తితో

పెద్దవారుండ నేముందు వేయనంచు
పట్టుదలలోననుం గౌరవమ్ము నెఱపె
రాచమల్లు బాదనఁజూచి బ్రహ్మనాయ
డన్న నీవేయుమయ్య ముందనివచింప

బ్రహ్మనాయని పేరిటి బద్దదక్క
నరటి దవ్వాల నన్నింటి తరిగిపోసె
బాదనాయనికత్తి విస్ఫారధార
రాచమల్లు నేత్రాంతముల్ ప్రజ్వరిల్లె.

కాళము మామపేరిటిది కాక యికొక్కడుదవ్వ యుండగా
దాళడు బాదనాయ డిక తగ్గుటయేలని యాననాగ్రరే
ఖాళిని గంటువెట్టుకొని యంత చటుక్కున దూసి సూర్యభే
తాళము రివ్వునన్ విసరె దవ్వసహస్రము తాచు వ్రీలగా.

సూర్యబేతాళమ్ము క్షోణిలో పిడిదాక
దిగబడె—బాదన్న మొగముచివర
యెఱ్ఱనై పండినయెఱువు రేకలుతీర్చె
బ్రహ్మనాయుడు మోముప్రాల్చుకొనియె
తనలోని కదలిక తాళుకున్నాడు నాయడు
రాచమల్లు బ్రహ్మన్నచూచి
మామ! బేతాళమ్ము మహిలోన దిగబడె
కొంచెము తీసిపెట్టించునడిగె.

బ్రహ్మనాయుడు నౌనయ్య రాచవారి
కత్తులవి రాచవారికేగాని మాకు
ననువుపడవన్న నలరాజు హయముపరపి
పిడి యెడమకాల జర్రున వ్రీల లాగె.

జర్రుమని లాగినంతనె చంద్రవంక
పచ్చ పెళ్లలు పెళ్లలు నచ్చులచ్చు
లుగ ధరాభాగమంతయు పెగిలివచ్చి
ఒక్క చిఱుపెళ్ల తాకె నాయునికి నొసట.

ఎవ్వరి త్రోవ వారుచనిరెవ్వరు నెవ్వరి వంకజూడలే
రెవ్వరు నెవ్వరింబలుకరించనులే దలచంద్రభాగపై
దవ్వుల నొక్కనీలజలదంబు వినీలభుజంగికై వడిన్
రివ్వునలేచి తాననుసరించెను బో అలరాజు ప్రాణముల్

# యమదంష్ట్రిక

అళియరామరాయలు మహావీరశిఖామణి. రాజనీతికోవిదుడు. కళ్యాణిదుర్గ మొకసారి ఆయన ముట్టడించినప్పుడు జరిగిన సంగతులు ఈ కావ్యమున వ్రాయబడినవి. సదాశివనాయకునిది కేళాదిపురము. ఆవంశము వారు విజయనగరసామ్రాజ్యమునకు కుడిబుజము వంటివారు. ఇందు రామరాయల యుత్సాహశక్తి ప్రభుమంత్రశక్తుల కెట్లు మీఱిపోయినదో తెలియఁగలదు. అన్నిటికన్న చిత్రమిట్టి మహావీరుని కాలమున తల్లికోటలో తెలుగులోడిపోవుట.

నెలనాళ్లైనది కోట పట్టుబడలేనేలేదు కల్యాణి రా
యలకుం సిగ్గయి పోయెఁబో తెలుగుసైన్యంబుల్ వృథాక్రోధవ
హ్నులతో మండెడునారెడుం బతియుమంత్రుల్ దండనాథుల్ విని
శ్చలదీప్తాస్యులు పాలువోక సభలో సారింత్రు రక్తాక్షముల్.

కృత్స్నకాశపుపాల వెల్లి యొడిలో క్రీడించె శుక్లాష్టమీ
జ్యోత్స్నకారికుమారచంద్రముడుదిగ్వ్యూహంబులం హాసదీ
వ్యత్స్నతంబులుగాఁ బొనర్చి నృపపీఠాగ్రస్థ చంద్రోపలో
ద్యత్స్నేహంబు వెలార్చె తేని యొడలంతం చల్లనై పొల్చినం

చూచినచూపు త్రిప్పకయ చూచుచు గద్దియనుండి మెల్లగా
లేచి మదద్విపప్రణుతలీల నరేంద్రుడు పోవఁజొచ్చె నా
త్మోచితవృత్తిసైన్యపతులొక్కరునొక్కరు రాజు పార్శ్వభూ
మిఁ చరులౌచు మెల్లన గమించిరి తన్ముఖలగ్నదృష్టులై

నిసి యని కోటముట్టడిని నిల్వగలేదు తెలుంగు సైనికుల్
ముసరుచు పోయి యేబురుజు మూలకొ నిచ్చెనలెత్త లోనివా
రు శిలల మొత్త నచ్చటికి త్రోవను తీసెను రాజు తీసి ని
ల్చి సకల దుర్గపార్శ్వ పరిశీలన దృక్కులు చిమ్మె నంతటన్

మృత్యుదేవత చాచి మెఱపించు నాలుక
పోలిక కోట తల్పులను చూచి
తనకు శత్రులకు మధ్యగ నిల్చియున్న ర
క్షోమూర్తివలెఁ గోటగోడచూచి
తెలుగు సేనల ప్రాణముల కెత్తిన ఫణాళి
వలె నున్నకోటకొమ్ములను చూచి
విధిపన్నినది యనిర్భేద్యమా వ్యూహమ్మొ
కో యనఁ జాలినకోటఁజూచి

చూచి యేమార్గమును గూడఁ దోచరామి
పరమసాహసి యాధరాపాలమౌళి
పార్శ్వమున వ్రేలు తన కరవాలమొరను
దూసి కోటలోపలఁ బాఱవేసె విసరి

తెలి లేవెన్నెల చాలులో తళతళై దీపించు వజ్రాల ప
చ్చల నీలాల హొరంగువన్నెల సరుల్ ఛాయల్ తలారింపులై
తొలి క్రొక్కారుమెఱుంగులట్టులయి యెంతో వైన తేయాహృతో
జ్వాల దివ్యాహి వలెఁ చెలంగెనసి రాజద్ధామకేత్వాకృతిఁ

వివిధసైన్యములు నివ్వెఱవోయినిలచిరి
దండనాథులును చిత్రప్రతిమల
వలెనైరి కోటలోపలిశత్రుసైన్యంబు
మెఱుపువోలిక త్రాచుకరణి నేదో
పరతెంచి కోటలో పడుటయు తెలుగుసై
నికులుముట్టడినిమాని నిలబడుట
కనుగొని దానికి కారణంబెఱుగక
గుములుగానై కలగుండువడిరి

దండనాథులు రాజునేత్రములయందు
నిశితదృష్టులు చూచుచు నిలువబడిరి.
అరనిముసమాగి రామరాయాధినేత
మెల్లన వచించె నిట్లు గంభీరమూర్తి

అదె యమదంష్ట్రిక శత్రుల
సదనంబున పోయి వ్రాలె జనపతి రాజ్యం
బది యేమిరాజ్య మాత్మ
ప్రదరం బరికోట మాటుపడి యుండంగన్

మీలో నెవ్వరు సాహసుల్ కదలుడీ మీమీ ప్రతాపాగ్నితే
జోఽలంకారముగాగ శత్రుజనకళ్యాణంబు ఖడ్గాన కు
ద్దాలించం జనుడీ తెలుంగుముని విద్యారణ్యసన్న్యాసి ద
త్తాలంకారము బుక్కరాజు నసి తెండా! పోయి సైన్యాధిపుల్

అను నళియ రామరాయల
జననాథుని మాటలు విని సభయులు సాలో
చనులును సాశ్చర్యులు నౌ
చు నిలంబడిరి దళవాయిశూరులు పెలుచన్

తాళ తరుప్రమాణ తనుదైర్ఘ్యము గాఢకవాట వక్షముల్
నీలసరోరుహాభ రమణీయ విశాల విలోచనంబులున్
హేళిఁ జరించు మత్తగజ యానము తుమ్మెదగేరు కోరమీ
సాలును వొల్చు నాయకుడు చాగి యొకంఠు కృతప్రణాముడై

క్షోణీవాసవ! నాహైనర్చునిదిగో జోహారు మీయాజ్ఞ క
ళ్యాణంబెంత త్రిలోకముల్ గెలిచిమీయందెం జెలంగున్ మణి
శ్రేణిం గ్రుచ్చెద నంచువిన్నప మొనర్చెన్ మందహాసంబు నిః
శ్రేణుల్ గట్టెను లేతవెన్నెల ధరిత్రీభృన్ముఖోద్గారమై

క్షేనియనుజ్ఞ మెచ్చుదలరీతిని వచ్చెను. 'మాయనుజ్ఞ వి
ద్యానగరమ్ము నిక్కము సదాశివనాయకుగారు మీభుజా
స్థాన పరాక్రమార్జిత దిశాసువిశాలము మీరు నిన్ననే
కా నెల దాటలేదు కడకన్ హరియించి బిజాపురోద్ధతిన్'

తలవాంచి శెలవుగైకొని
మెలమెల్లన రాజు పార్శ్వమేదిని చేరెన్
దళవాయి గూఢచేతః
ప్రలోభగతులైరి సైన్యపతులెల్లరునున్

మట్టడిమాని వేసి యొక మూల గుడారము చేర నేగి ర
ప్పట్టున తెల్లుసేనలరి పక్షమువారలు వంతువారు కా
కెట్టిరు కోటగోడలఁ జరించరు రాతిరి వేళ నెప్పుడో
అట్టి శకాంకబింబ మది యస్తమయంబును బొందెనెట్టనై

కడల నాల్గింటఁ గటిక చీకటులు క్రమ్మి
అరులజాడలఁ దెలసికోనపుడు కోట
గోడలందున దివిటీ లొక్కొండు రెండు
కడగి వెలిగింపఁబడి యార్పఁబడుచు వచ్చె

అంతట కాగడా వెలుగులారినఁజీకటులింక దట్టమై
చెంతలనున్న జీవమొక చీమయు కన్పడకుండ నాంధ్య మ
త్యంతము క్రమ్మె కోటదరి ద్వారమునొద్ద నదేమొ నల్లనై
యింతయు సవ్వడింబడి చరింపదు! చీకటిలోన నైక్యమై

ఒక నిముసంబులో ఫెళఫెళోద్ధతి నేనుగు తాకి యొత్తిగి
ల్లకమునుపే మఱొక్కటి బలంబుగఁ దాకుచు నిల్చియున్న యే
నిక లొక బారుతీర్చి గజనిర్భరకుంభ మహాప్రఘాత మే
చి కదలి కోటతల్పులవి చీలెఁ బటాపటమంచు బద్దలై

నేటి కోటలోవారు నిద్రామదపరీత
నేత్రులై యాయుధాల్ నెమకుకొనుచు
చేరకమును సదాశివనాయకులవారి
తెలుగుబంటులు కోటతలుపుచెక్క
లటు నిటుత్రోసి యభ్యంతర భటశిర
స్కంధముల్ తెగగొట్టి గంధసింధు
రమ్ములు విడివడ్డ రమణ పైబురుజుల
కెగబ్రాకి స్వాధీనముగ నొనర్చి
కోట యెల్లెడ తామయై ఘూర్ణమాన
వారిరాశి విధంబున వరలునంత
ఉదయ పర్వతశిఖర సానూపలములు
ధగ ధగని ప్రజ్వరిల్లె మార్తాండరోచి

ఉదయన వారుణాంశులు కవోష్ణములై దెసలందు బర్వ్వచో
ముదితుడు రామరాయలు విభుండు మహాసభ తీర్చి పొల్చినన్
దదవసరంబునందు 'యమదంష్ట్రిక' చేకొనివచ్చి శత్రుహ
స్తదళనయోగ్యహస్తుడు సదాశివనాయకు డిచ్చెతేనికిన్